**Islam aur Ruhbaniyyat**
**(Telugu)**

# భవబంధాలు మోక్షానికి ప్రతిబంధకాలా?

కూర్పు
**నసీమ్ గాజి**

అనువాదం
**ఇక్బాల్ అహ్మద్**

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# భవబంధాలు మోక్షానికి ప్రతిబంధకాలా ?

మోక్ష సాధనకు ప్రాపంచిక సుఖభోగాలను త్యజించి జన సంచారానికి దూరంగా, ఏకాంతంగా ఉండటాన్ని; కోరికల్ని జయించడానికి కొండల్లో, గుహల్లో జీవితం గడపటాన్ని వివిధ మతాలు పాటించే విషయం.

భారతీయ మతాలలో జైన మతం ఇలాంటి ధోరణినే ప్రబోధిస్తుంది. జైన మత స్థాపకుడు వర్ధమాన మహావీరుడు ప్రపంచ వ్యవహారాలకు దూరంగా ఉండేవాడు. ఐహిక ప్రపంచాన్నే త్యజించాడు. చివరికి ప్రాపంచిక వస్త్రాల నుండి ఒక నూలు పోగు కూడా వంటి మీద ధరించడం ఇష్టపడక దిగంబరుడుగా జీవించేంతగా బాహ్య ప్రపంచాన్ని విసర్జించాడు. ఈనాటికీ ఆయన అనుచరులు భక్తిభావ శిఖరాలకు చేరుకునేందుకు మహావీరుని అనుసరిస్తూ పూర్తి దిగంబరులయి, మామూలు వస్తు సామాగ్రిని సైతం తమ వెంట ఉంచుకోరు.

ఇదే విధంగా బౌద్ధ మతంలో కూడా మోక్ష సిద్ధికి భౌతిక ప్రపంచముతో సంబంధాన్ని తెగత్రెంపులు చేసుకోవడం అవసరం. బౌద్ధమత స్థాపకుడు అయిన గౌతమ బుద్ధుడు తల్లిదండ్రుల్ని, భార్యాపిల్లల్ని, రాజ్యాన్ని పరిత్యజించి సన్యాస జీవితం అవలంబించాడు. మోక్షం పొందటానికి ఇదే సరైన మార్గం అన్నాడు.

హిందూ ధర్మంలో కూడా వ్యక్తి జీవన పథంలోని నాలుగు దశల్లో బ్రహ్మచర్యం, గార్హ్యస్థం, వానప్రస్థాలు దాటి ఆఖరి దశ సన్యాసమే. మనుస్మృతిలో "గృహస్థు వెంట్రుకలు తెల్లబడి, దేహం ముడతలు పడి, అతని కుమారుడు సంతాన వంతుడయినప్పుడు భార్యని కొడుకు రక్షణలో ఉంచి అడవుల్లోకి వెళ్ళిపోవాలి. సాంఘిక జీవితంలో అనుభవించే తిండి, బట్ట ఇంకా ఇతర మేలయిన వస్తువు లన్నిటికి స్వస్తి చెప్పాలి. అంటే అరణ్యాలకు పోయి నారబట్టలు ధరించి కంద మూలాలు తింటూ దైవ ధ్యానంలో గడపాలి. కావాలంటే భార్య కూడా సంసారిక

బంధాలు త్యజించి అతనితోపాటు అరణ్యాలలో జీవితం గడిపేందుకు వీలుంది. ఇలా వానప్రస్థాశ్రమంలో మాత్రమే చెయ్యవచ్చు. కాని సన్యాసాశ్రమంలో భార్యతో ఉండటాన్ని, ఏ విధమయిన ప్రాపంచిక వస్తువు కలిగి ఉండడానికి వీలు లేదు" అని ఉటంకించబడింది.

ఎవరయినా నిష్టాపరుడు విద్యాభ్యాసానంతరం గార్హ్యస్థ జీవితంలో ఇరుక్కోకుండా ఏకంగా సన్యాస జీవితం అవలంబించదలచుకుంటే దానికి వీలుంది.

కాని ఇస్లామ్ మోక్ష సాధన మార్గంలో ఇహంలో ఉంటూ ఐహిక వస్తువులను అనుభవించటాన్ని ఏ విధమయిన ఆటంకముగా గానూ భావించదు. అసలు మానవుణ్ణి ఇహలోకంలో జీవించడం నేర్పటానికే ఇస్లామ్ వచ్చింది. అది తన సిద్ధాంతాలకు లోబడి పరిపాలనా వ్యవస్థను నడపడాన్ని కూడా గొప్ప పుణ్య కార్యంగానూ, మోక్ష సాధనంగానూ నిర్ణయించింది. బుఖారీ, ముస్లిమ్ హదీసు గ్రంథాలలో మహా ప్రవక్త (స) ప్రవచించారు : "పరలోకంలో దైవాశ్రయం తప్ప మరో ఆశ్రయం లభించని పరిస్థితిలో, దైవం ఏడుగురికి (ఏడు రకాల వ్యక్తులకు) తన ఆశ్రయం కారుణ్యంలో స్థానం కల్పిస్తాడు."

ఆ ఏడుగుర్ని గురించి వివరిస్తూ ఆయన (స) మొదటగా పేర్కొన్నది: "న్యాయ శీలుడయిన పాలకుడు."

ఇస్లామ్ ఒక సమగ్రమయిన జీవన వ్యవస్థ. ఇది జీవితంలోని అన్ని రంగాలలో మానవునికి మార్గం చూపుతుంది. కాబట్టి ఇహంలో ఉంటూ, ప్రపంచ వ్యవస్థను నడిపే వారి కోసమే ఇస్లామ్ ఉంది. అంతేకాని ఐహికత్వానికి విముఖులై అడవుల్లో, కొండ గుహల్లో, ఏకాంత కుహరాల్లో జీవితం గడిపేవారి కోసం కాదు. నైతికత, సచ్ఛీలతల వంటి ఉన్నత గుణగణాల్ని ప్రజలు సన్యాసాశ్రమాలలో, ఏకాంత కుహరాలలో అన్వేషిస్తారు. అయితే ఇస్లామ్ వాటిని జీవితంలో ఎడతెగని కార్యకలాపాల్లో జనింపజేయకోరుతుంది. ప్రపంచ వాసులందరూ ఏ రంగానికి చెందినవారయినప్పటికీ వారిలో కావలసిన నైజాన్ని జనింపజేసి వారిని సకల గుణగణాలుగల సద్వర్తనులుగా తీర్చిదిద్దాలని ఆకాంక్షిస్తుంది.

ఇస్లామ్ దృక్పథంలో సన్యాసం, సర్వసంగపరిత్యాగం ధర్మ విరుద్ధమే గాక, కల్లోలాలు, ఉపద్రవాలకు కూడా కారణభూతమవుతాయి. ఈ భావాన్ని దివ్యఖుర్ఆన్‌లోని 'అల్ హదీద్' సూరా వాక్యాలు (26,27) ఇలా తెలియ జేస్తున్నాయి:

"మేము నూహ్ మరియు ఇబ్రాహీమ్‌ను పంపాము. వారిద్దరి వంశంలో దైవ దౌత్యాన్ని, దైవ గ్రంథాన్ని ప్రసాదించాము. వారి సంతానంలో కొందరు ప్రబోధాన్ని స్వీకరించారు. అనేకులు ధిక్కరించారు. వారి తరువాత అనేక ప్రవక్తలను పంపాము. వీరందరి తరువాత మరియమ్ కుమారుడయిన ఈసా (క్రీస్తు)ను ప్రభవింపజేసి ఆయనకు 'ఇంజీల్'ను ప్రదానం చేశాము. ఎవరయితే ఈసా అనుసరణ మార్గాన్ని అవలం బించారో వారి హృదయాలను కరుణ, ప్రేమలతో నింపాము. సన్యాసాన్ని వారు స్వయంగా సృష్టించుకున్నారే కాని వారిపై మేము 'విధి'గా ఆజ్ఞాపించలేదు. మేమసలు వారిపై విధించింది 'దైవప్రీతి'ని పొందటమే, అయితే వారు సన్యాసత్వంలోని నిబంధనలను కూడా పూర్తి చేయలేకపోయారు. వారిలో విశ్వసించిన వారికి ప్రతిఫలం ఇచ్చివేశాం. కాని వారిలో అనేకులు ధిక్కరించినవారే."

ఈ వాక్యంలో 'సన్యాసం' అనే పదం వచ్చింది. ఈ పదానికి వివరణ ఆ పదానికి సంబంధించిన వాక్యానికి పూర్తి విశదీకరణ ప్రఖ్యాత ఆధునిక తత్వవేత్త మరియు ఖుర్ఆన్ వ్యాఖ్యాన కర్త అయిన సయ్యిద్ అబుల్ ఆలా మౌదూదీ (రఅ) గారి అపూర్వ ఖుర్ఆన్ వ్యాఖ్యాన గ్రంథమయిన తఫ్‌హీముల్ ఖుర్ఆన్ ఐదవ భాగంలో ఉన్నాయి. అందులో ఆయన సన్యాసం అనే పదం ధాతువు రహబ్‌కు అర్థం 'భయం' అని రాశారు.

"సన్యాసం అంటే భయగ్రస్తం. పారిభాషికంగా దీని భావం ఒక వ్యక్తి కారణంగా భయం (అంటే ఒకరి దౌర్జన్యం వలన భయం కావచ్చు, ప్రాపంచిక జంఝాటం భయం, తన బలహీనతల పట్ల భయం కావచ్చు) ప్రపంచ జీవితానికి

దూరంగా పారిపోయి అడవుల్లో, కొండల్లో ఆశ్రయం కల్పించుకోవడం లేదా ఏకాంత కుహరాల్లో కూర్చోవడం."

ఈ ఆయత్ వెలుగులో మౌలానా "క్రైస్తవులపై అల్లాహ్ సన్యాసాన్ని విధిగా చేయలేదు" అని తన వ్యాఖ్యానంలో పేర్కొన్నారు.

వైరాగ్యం అనేది ఇస్లామ్‌కు సంబంధించింది కాదు. సత్యధర్మంలో దీనికి తావులేదు. ఇదే విషయాన్ని గురించి మహాప్రవక్త (స) ప్రవచించారు. "ఇస్లామ్‌లో ఎటువంటి వైరాగ్యం లేదు" (ముస్నద్ అహ్మద్). "దైవ మార్గంలో జిహాద్ చేయడమే ఈ ఉమ్మత్ (అనుచర సంఘం)". సన్యాసం (భయభక్తులు లేక ఆరాధన) అని మరో హదీసులో అన్నారు, (ముస్నద్ అహ్మద్-మస్నద్ అబీయాలా). అంటే దైవ మార్గంలో జిహాద్ చేయడమే ఆధ్యాత్మిక ప్రగతి పథానికి సోపానం. ప్రాపంచిక వైరాగ్యం కాదు. ఈ ఉమ్మత్ ఉపద్రవాలకు భయపడి కొండల్లో కోనల్లోకి పారిపోదు. దైవ మార్గంలో జిహాద్ (ధర్మయుద్ధం) చేసి వాటినెదుర్కొంటుంది. బుఖారీ మరియు ముస్లిం హదీసుల ప్రకారం సహాబాలలో ఒకరు. "నేను ఎల్లప్పుడూ రాత్రంతా నమాజ్ చేస్తాను" అనీ, మరో సహాబీ "నేను రోజూ నాగా లేకుండా రోజా (ఉపవాస వ్రతం) పాటిస్తాను." అనీ, మూడో సహాబీ "అసలు నేను వివాహమే చేసుకోను. స్త్రీతో ఎటువంటి సంబంధమూ కలిగి ఉండను" అని అన్నారు. దైవప్రవక్త (స) సహాబాల ఈ మాటలు విని, "దైవసాక్షి! నేను మీ కంటే ఎక్కువగా దేవునికి భయ పడతాను. ఆయన పట్ల భయభక్తులు కలిగి ఉంటాను. అయినా నా పద్ధతి ఏమంటే నేను ఉపవాసం ఉంటాను. ఒక్కోసారి ఉపవాసం ఉండను కూడా. రాత్రులలో నమాజ్ చేస్తాను, పడుకుంటాను కూడా. స్త్రీలను వివాహం కూడా చేసుకుంటాను. నా పద్ధతి ఎవరికి నచ్చదో వారితో నాకెలాంటి సంబంధం లేదు."

మీపై మీరు కాఠిన్యం వహించుకోకండి. అల్లాహ్ మీపై కాఠిన్యం వహిస్తాడు. ఒక వర్గం ఇలాగే కఠిన ధోరణి అవలంబిస్తే అల్లాహ్ కూడా వారిని కఠినంగా పట్టుకున్నాడు (కావాలంటే) "చూసుకోండి వారు, వారి అవశేషాలు

సన్యాస మఠాల్లో ఉన్నాయి" అని మహాప్రవక్త (స) ఉపదేశించినట్లు హజ్రత్ అనస్ (రజి) తెలియజేస్తున్నారు. *(అబూదావూద్)*

సన్యాసం (వైరాగ్యం) అవలంబించి క్రైస్తవులు రెండు విధాలుగా తప్పుచేశారు ఒకటి : దైవం ఏ మాత్రమూ ఆజ్ఞాపించని నిర్బంధాల్ని తమపై విధించుకున్నారు. రెండు : ఏ నిర్బంధాలనయితే దైవప్రీతి పొందడానికి సాధనాలుగా భ్రమించి తమపై విధించుకున్నారో వాటి హక్కును నిర్వర్తించలేదు. పైగా వారు దైవ ప్రీతికి బదులు దైవాగ్రహాన్నే కొనితెచ్చుకున్నారు.

ఈ విషయాన్ని పూర్తిగా అర్థం చేసుకోవాలంటే ఒక్కసారి క్రైస్తవ వైరాగ్య చరిత్రపై దృష్టి సారించాలి.

హజ్రత్ ఈసా అలైహిస్సలామ్ తదనంతరం 200 సంవత్సరాల వరకు క్రైస్తవ చర్చీలకు సన్యాసం అంటే ఏమిటో తెలియదు. కాని మొదటి నుండే (ఈసా (అ.స.) తర్వాత) క్రైస్తవంలో దాని బీజాలు ఉండేవి. ఆ బీజాలే చివరికి వైరాగ్యాన్ని జనింపజేశాయి. సర్వసంగపరిత్యాగాన్ని నైతిక ఆదర్శంగా నిర్ణయించడం, సన్యాస జీవితాన్ని, వైవాహిక, ప్రాపంచిక జీవితాలకంటే మంచిదని భావించటమే వైరాగ్యానికి పునాది అయింది. ఇవి క్రైస్తవంలో ఆది నుంచీ ఉంటూ వచ్చాయి. ప్రాపంచిక విషయాలకు దూరంగా ఉండటాన్ని పవిత్రంగా భావించడం వల్ల, చర్చీలలో ధార్మిక సేవలు చేసే వారు పెళ్ళి చేసుకోవడం, పిల్లల్ని కనడం, సంసారం సమస్యల్లో చిక్కుకోవడం అప్రియమయినదిగా భావించబడింది. ఇది క్రమేణ వ్యాప్తి చెందుతూ 3వ శతాబ్ది నాటికి చరమ స్థాయికి చేరుకుంది. ఈ విధంగా సన్యాసత్వం మొదలై, అంటువ్యాధిలా క్రైస్తవంలో వ్యాప్తిచెందసాగింది. చారిత్రకంగా దీనికి మూడు కారణాలున్నాయి.

మొదటిది, బహు దైవారాధన ప్రబలి ఉన్న ప్రాచీన సమాజంలో ఇంద్రియ లోలత్వం, చెడు నడత, భోగలాలసత్వము విచ్చలవిడిగా వ్యాపించి ఉండినందువల్ల దాని విరుగుడు కోసం క్రైస్తవ పండితులు మధ్యేమార్గం అవలంబించే బదులు తీవ్రవాద ధోరణి నవలంబించారు. వివాహ రూపంలోనైనా సరే స్త్రీ పురుషుల

సంబంధమే ధర్మ విరుద్ధంగా ప్రకటించబడింది. వారి దృష్టిలో ఇదే పవిత్రతకు పరాకాష్ఠ. వారు ప్రాపంచిక విషయాలలో పాలుపంచుకోవడాన్ని ఎంతగా వ్యతిరేకించారంటే ఒక ధర్మపరాయణుడు ( ఏ విధమయిన) ఆస్తిపాస్తులు కలిగి ఉండటమే పాపమయిపోయింది. మానవుడు మరీ పేదవాడుగా, విరాగిగా అయి పోవడమే నైతికతకు కొలబద్దగా భావించబడింది. ఈ విధంగా బహుదైవారాధకుల సమాజంలో ఉన్న భోగలాలసత్వానికి ప్రతిగా అభిరుచుల్ని వదులుకోవటం, స్వయాన్ని అణగదొక్కడం, కోరికల్ని చంపుకోవడం నైతికతకు మారుపేర్లయి పోయాయి. రకరకాల శ్రమలతో శరీరాన్ని శుష్కింపజేయడం మానవుడి ఆధ్యాత్మికత మహత్యంగా, అతని నైపుణ్యానికి నిదర్శనంగా భావించబడింది.

రెండోది, క్రైస్తవం ఉచ్ఛ దశకు చేరి ప్రజలలో వ్యాప్తి చెందసాగాక ధార్మిక ప్రచారోత్సాహంలో సర్వజన సామాన్యమైన చెడులన్నింటినీ చర్చీ క్రైస్తవంలో చేర్చుకుంటూపోయింది. ప్రాచీన దేవతల స్థానే భక్తుల్ని ఆరాధించడం అనేది సర్వ సాధారణమయింది. హోరస్ (Horus), ఐసిస్ (Isis),ల విగ్రహాలకు బదులు జీసస్, మేరీల విగ్రహారాధన జరగసాగింది. శాటర్నేలియా (Saturnalia)కు బదులు 'క్రిస్మస్' పండుగ అయింది. ప్రాచీన కాలం నాటి తావీజులు, గండమాలలు; మంత్ర విద్యలు, జ్యోతిష్యం, భూత విద్య మొదలగు వాటన్నింటిని క్రైస్తవ సాధువులు చేయనారంభించారు. దిగంబరుడయి, అపరిశుభ్ర శరీరంతో, పాతరలలో ఉండేవాణ్ణి ప్రజలు దైవాంశ సంభూతుడుగా భావించటం వల్ల క్రైస్తవ చర్చీలలో ఈ భావమే సర్వసామాన్యమయిపోయింది. కనుకనే క్రైస్తవుల వద్ద ఉన్న "దైవభక్తుల గాధలు" లాంటి పుస్తకాలు ఇటువంటి వారి మహత్యాల కథలతోనే నిండివున్నాయి.

మూడవ విషయం, క్రైస్తవంలో ధర్మానికి హద్దులు నిర్ణయించేందుకు వివరణాత్మకమయిన షరీఅత్ (ధర్మశాస్త్రం) గానీ, స్పష్టమయిన ఆచరణాత్మక సూత్రాలు, ఆదర్శంగాని ఏవీ లేవు. హజ్రత్ మూసా (అస్సలామ్) షరీఅత్‌ని వారు ఏనాడో వదిలేశారు. బైబిల్‌లో సమగ్రమైన బోధ ఏదీ వారికి కనబడలేదు. అందుచేత క్రైస్తవ పండితులు ఇతరుల తత్వాలు, విధానాలవల్ల ప్రభావితులై ఇంకా,

వారు తమ ఆలోచనల దృష్ట్యా అనేకానేక ప్రమాణ రహిత విషయాల్ని ధర్మంతో ముడిపెడ్తూ వచ్చారు. సన్యాసత్వం కూడా అందులో ఒకటి. క్రైస్తవ పండితులు, నాయకులు ప్రస్తుత క్రైస్తవ తత్వాన్ని, విధానాన్ని, బౌద్ధ భిక్షువుల నుండి, హిందూ జోగులు, సన్యాసులు, ప్రాచీన ఈజిప్ట్ ఫకీర్లు (Anchorites), ఈరానీ వైరాగులు, అఫ్లాతూన్, ఫిలాత్యూనియస్ అనుచరుల నుండి స్వీకరించారు. సన్యాసత్వాన్నే ఇంద్రియ నిగ్రహానికి, ఆధ్యాత్మికాభివృద్ధికి మార్గం గానూ, దైవ సాన్నిధ్యానికి చేర్చే ఏకైక మంత్రంగా నిర్ణయించారు. ఇటువంటి తప్పిదాన్ని చేసిన వారు సాధారణ ప్రజ కాదు. క్రీ.శ. 3వ శతాబ్ది నుండి 7వ శతాబ్ది (అంటే ఖుర్ఆన్ అవతరించిన కాలం) వరకు ప్రాక్పశ్చిమాల్లో గొప్ప గొప్ప క్రైస్తవ పండితులు, ధార్మిక నిర్దేశకులు, నాయకులుగా భావించబడే సెయింట్ అథనాస్యూస్, సెయింట్ బాసిల్, సెయింట్ గ్రిగరీ నాజియాన్ జాన్, సెయింట్ క్రిసుస్టుమ్, సెయింట్ అంబ్రోజ్, సెయింట్ జీరోమ్, సెయింట్ అగస్టీన్, సెయింట్ బెన్‌డిక్టు గ్రిగరీ ఆజం మొదలగు వారంతా స్వయంగా సన్యాసులవడమేకాక, సన్యాసత్వం ప్రబోధకులుగా, ప్రచారకులుగా మారారు. వీరి ప్రయత్నాల ఫలితంగా చర్చీలలో సన్యాసత్వం రివాజైపోయింది.

, క్రైస్తవులలో సన్యాసత్వం ఈజిప్ట్ నుండి ప్రారంభమైనట్లు చారిత్రక ఆధారాలు తెలుపుతున్నాయి. దాని స్థాపకుడు సెయింట్ ఆంథోనీ (క్రీ.శ. 250-350) మొట్టమొదటి క్రైస్తవ సన్యాసిగా పేరుగాంచాడు. ఈయన "ఫయ్యూం" ప్రాంతంలో పస్పీర్ అనే చోట (ఇప్పుడది దయర మైమోన్‌గా ప్రసిద్ధమైంది) మొట్టమొదటి సన్యాస మఠం స్థాపించాడు. తర్వాత రెండో మఠాన్ని ఎర్ర సముద్ర తీర ప్రాంతంలో స్థాపించాడు. ఇప్పుడు దాన్ని దయర్‌మార్ అంతిన్యూస్ అంటారు. క్రైస్తవులలో సన్యాసత్వపు ప్రాథమిక సూత్రాలు, అతడి బోధలు, వ్రాతలలో నుండి స్వీకరింప బడినవే. ఇలా ప్రారంభమయిన ఈ వైరాగ్య భావం ఈజిప్ట్‌లో ప్రవాహంలా సాగిపోయి ప్రతి చోట సన్యాసులకు, సన్యాసినులకు సన్యాస మఠాలు స్థాపించ బడ్డాయి. కొన్ని మఠాలలో ఒక్కొక్క దాంట్లో 3 వేల మంది సన్యాసులుండేవారు. క్రీ.శ. 325లో ఈజిప్ట్‌లోనే ఫాఖామూస్ అనే క్రైస్తవ భక్తుడు ఒకడు సన్యాసులు, సన్యాసినుల నిమిత్తం పది పెద్ద మఠాలు కట్టించాడు. ఆ తర్వాత ఈ పరంపర,

సిరియా, పాలస్తీనా, ఆఫ్రికా మరియు యూరప్‌లోని వివిధ దేశాలలో కొనసాగుతూ పోయింది.

చర్చీ వ్యవస్థకు ఆరంభంలో ఈ సన్యాసత్వం విషయంలో గట్టి చిక్కే వచ్చింది. ఎందుకంటే చర్చీవారు ప్రాపంచిక సుఖాల పరిత్యాగాన్ని, బీదరికాన్ని, లేమిని, ఆధ్యాత్మిక జీవితపు ఆదర్శంగా భావిస్తారు. కాని సన్యాసుల లాగా భార్య, సంతానం, ఆస్తిపాస్తులు కలిగి ఉండటాన్ని పాపంగా మాత్రం నిర్ధారించలేకపోయారు. చివరికి సెయింట్ అధానాస్యూస్, సెయింట్ బాసిల్, సెయింట్ అగస్టీన్, గ్రిగరీ అజంల వంటి ప్రముఖ వైరాగ్యుల ప్రభావం వల్ల సన్యాసత్వంలోని అనేక విధానాలు సరాసరి చర్చీలోకి వచ్చి చోటు చేసుకున్నాయి.

ఇటువంటి విచారకరమైన బిద్అత్ (ధర్మంలో లేనిది) యొక్క కొన్ని ప్రత్యేకతలు పరిశీలిద్దాం:

1) కఠోర నియమాల ద్వారా నిత్యం ఈ నూతన విధానాల ద్వారా శరీరాన్ని శుష్కింపజేయడం. ఈ విషయంలో ప్రతి సన్యాసి మరో సన్యాసిని అధిగమించడానికి ప్రయత్నం చేసేవాడు. అటువంటి మహాపురుషులు (సన్యాసుల దృష్టిలో) చేసిన కొన్ని అద్భుతాలు : గ్రీకు సెయింట్ మకారియోస్ ఎల్లవేళలా తన శరీరంపై 80 పౌండ్ల బరువు మోస్తుండేవాడు. 6 నెలల వరకు అతడొక ఊబిలో పడుకొని ఉండేవాడు. విష కీటకాలచే తన నగ్న శరీరాన్ని కుట్టించుకునేవాడు. అతని శిష్యుడు గురువును మించిపోయాడు. అతడు 150 పౌండ్ల బరువు మోస్తూ తిరిగేవాడు. మూడేండ్ల వరకు ఒక పాడుబడిన బావిలో పడి ఉన్నాడు. సెయింట్ సాబియూన్ నెల రోజుల పాటు నీళ్ళలో నాని, కుళ్ళి కంపుగొట్టు మొక్కజొన్ననే భుజించేవాడు. సెయింట్ బెసారియూన్ వరుసగా నలభై రోజుల వరకు ముళ్ళ పొదలలో పడి ఉండేవాడు. 40 సంవత్సరాల వరకు అతడు వీపు నేలకానించలేదు. సెయింట్ పాఖూమ్యూస్ 15 ఏళ్ళు, మరో ఆధారం ప్రకారం 50 ఏళ్ళు నేల మీద వీపు ఆనించకుండానే గడిపాడు.

సెయింట్ జాన్ మూడేళ్ళు నిలబడే తపోనిష్ఠలో గడిపాడు. ఈ మధ్య కాలంలో ఒక్కసారి కూడా అతడు కూర్చోవడం గానీ, పడుకోవడం కానీ చేయలేదు.

ఒక రాతిని విశ్రాంతి కోసం అనుకునేవాడు. ప్రతి ఆదివారం తన కోసం తేబడే ప్రసాదాన్ని మాత్రమే భుజించేవాడు. సెమ్యూన్ స్టాలాట్ క్రైస్తవ మహాపురుషులలో ఒకడుగా పరిగణింపబడ్డాడు. ఇతడు ప్రతి ఈస్టర్‌కు ముందు 40 రోజులు కటిక ఉపవాసం పాటించేవాడు. ఒకసారి అతడు ఒంటికాలిపై సంవత్సరమంతా నిలబడ్డాడు. కొన్ని సందర్భాలలో అతడు తన సన్యాస మఠం నుండి బయటకు వచ్చి ఒక బావిలో దిగి ఉండేవాడు. చివరకు ఉత్తర సిరియాలోని సేమాన్ కోటకు చేరువలో 60 అడుగుల స్తంభాన్ని కట్టించాడు. దాని పైభాగం వ్యాసం కొలత 3 అడుగులు మాత్రమే. స్తంభం అగ్రభాగం బోనులా కట్టబడింది. ఆ స్తంభంపై అతడు 30 ఏళ్ళు గడిపాడు. ఎండ, వాన, చలి, వేడి ఏవీ కూడా అతన్ని అక్కడ నుంచి కదల్చలేకపోయాయి. అతడి శిష్యులు నిచ్చెనల ద్వారా అతనికి ఆహార పానీయాలు అందించి, అతని మాలిన్యాన్ని శుభ్రపర్చేవారు. అతడు తన శరీరాన్ని ఒక త్రాటితో స్తంభానికి కట్టుకున్నాడు. ఆ త్రాడు బిగిసిపోయి శరీరంలో చొచ్చుకుపోయింది. దాంతో శరీరం కుళ్ళిపోయి పురుగులు పడ్డాయి. పుండ్లలో నుంచి జారిపడిన పురుగుల్ని తిరిగి ఆ పుండ్లలోనే వేసుకుని "తిను, దైవం నీకిచ్చినదాన్ని తిను" అని పలికేవాడు. అతడ్ని చూసేందుకు దూరదూరాల నుండి క్రైస్తవులు వచ్చేవారు. అతడు మరణించినప్పుడు, క్రైస్తవ భక్తుల్లోకెల్లా అతడు గొప్పవాడని ప్రజలు తీర్పు ఇచ్చారు.

1) ఆ కాలపు క్రైస్తవ మహాపురుషులనబడే వారి గొప్పతనాలు ఇటువంటి ఉదాహరణలతోనే నిండియున్నాయి. ఒకాయన గురించిన ప్రశంస వినండి. ఆయన 30 ఏళ్ళ వరకు మౌనవ్రతం పాటంచాడట! అతడు మాట్లాడుతుండగా చూసిన వారు లేరు. మరొకాయన తనను తాను పెద్ద రాతితో కట్టుకుని ఉండిపోయాడు. ఒక వ్యక్తి అడవుల్లో సంచరిస్తూ ఆకు అలము తింటూ కాలం గడిపాడు. ఇంకొక వ్యక్తి పెద్ద బరువును మోస్తూ తిరిగేవాడు. వేరొకాయన కాళ్ళు చేతులకు ఇనుప కచ్చడాలు, సంకెళ్ళు వేసుకొని ఉండేవాడు. కొందరైతే జంతువుల బొరియల్లోనూ, పాడుబడిన బావుల్లోనూ, పురాతన గోరీలలోనూ నివసించేవారు. మరికొందరు సదా దిగంబరులు. వారి పొడవాటి జుట్టు

ఆచ్ఛాదనగా అంగాల్ని కప్పుకొని భూమి మీద ప్రాకుతూ, నడిచేవారు. ఇటువంటి మహాపురుషుల మహత్యాల గురించిన చర్చలు బాగా వ్యాప్తిలో ఉండేవి. వీరి మరణానంతరం వీరి ఎముకల్ని ఆశ్రమాల్లో భద్రపరిచేవారు. సినాయ్ పర్వతం దిగువ భాగాన సెయింట్ కేథరిన్ ఆశ్రమంలో ఇటువంటి ఎముకలతో నిండిన సమగ్ర లైబ్రరీ ఒకటుంది. ఆ లైబ్రరీలో ఒకచోట క్రైస్తవ సన్యాసుల చేతి ఎముకలు ఇంకోచోట కాళ్ళ ఎముకలు, మరోచోట కపాలాలు తీర్చిపెట్టబడి ఉన్నాయి. ఒక సన్యాసి పూర్తి అస్తిపంజరమే గాజు అల్మాయిరాలలో భద్రపరచబడి ఉంది.

2) వారి రెండో ప్రత్యేకత ఏమిటంటే వారెప్పుడూ అపరిశుభ్రంగా ఉంటూ, పరిశుభ్రతను పరిత్యజించేవారు. స్నానం చేయడం, వంటికి నీరు తగలడం వారి దృష్టిలో దైవారాధనకు వ్యతిరేకం. శారీరక పరిశుభ్రతని వారు ఆత్మమాలిన్యంగా భావించేవారు. సెయింట్ అథానాస్యూస్ ఎంతో భక్తిభావంతో, సెయింట్ ఆంథోని గురించి "ఆయన జీవిత కాలంలో ఏనాడూ కాళ్ళు కడుక్కోలేదు" అని అన్నాడు. సెయింట్ అబ్రహాం క్రైస్తవంలో చేరాక పూర్తి 50 ఏళ్ళు మొహంకానీ, కాళ్ళుకాని కడుగలేదు. ప్రఖ్యాత సన్యాసిని కుమారి సిల్వియా జీవితాంతం తన వేళ్ళు తప్ప శరీరంలోని ఏ భాగానికి నీళ్ళు తగలనీయలేదు. ఒక కాన్వెంట్‌కు చెందిన 120 మంది సన్యాసినులు ఏనాడూ కాళ్ళు కడుక్కున్న పాపాన పోలేదట. ఇక స్నానం మాట ఎత్తితేనే వాళ్ళు కంపించిపోయేవారట.

3) ఈ సన్యాసత్వం దాంపత్య జీవితాన్ని ఆచరణాత్మకంగా నిషేధించింది. వివాహ బంధాన్ని త్రెంచి వేయడంలో కఠినాతికఠినంగా వ్యవహరించింది. క్రీ.శ. 4, 5 శతాబ్దాలకు చెందిన ధార్మిక రచనలన్నీ వైరాగ్యాన్ని ఉత్తమ నైతిక విలువగా అభివర్ణిస్తూ భార్యాభర్తలయినా స్త్రీ పురుష సాంగత్యాన్ని ఏవగించుకునే భావాలతో నిండి ఉన్నాయి. స్వయాన్ని అణచటం, శారీరక సుఖానికి చెందిన కోరికలన్నిటిని అంతం చేయడమే పవిత్ర ఆధ్యాత్మిక జీవితంలోని గొప్పతనంగా భావించబడు తుండేది.

వారి దృష్టిలో కోరికల్ని జయించడం అవసరం. అలా చేయకపోతే పశు త్వాన్ని పెంచినట్లవుతుంది. వారి దృష్టిలో సౌఖ్యం పాపంతో సమానం. ఆఖరికి

వారి దగ్గర సంతోషం కూడా దైవ విస్మరణతో పోల్చబడినది. సెయింట్ బాసిల్ నవ్వడాన్ని, చిరునవ్వు చిందించడాన్ని కూడా నిషిద్ధం చేశాడు. ఈ భావనల దృష్ట్యా స్త్రీ పురుషుల మధ్య వివాహ బంధం వారి దృష్టిలో అపవిత్రంగా నిర్ణయించబడింది. పెళ్ళి చేసుకోవడం అటుంచి, స్త్రీ రూపాన్ని చూడడం కూడా సన్యాసికి విరుద్ధమే. పెళ్ళి చేసుకున్న వ్యక్తి సన్యసించాలంటే కట్టుకున్న భార్యని వదలిపోవాలి. పురుషులలో వలె స్త్రీలు కూడా, దేవుని రాజ్యంలో ప్రవేశించగోరితే వారు ఎల్లప్పుడూ 'కుమారి'గానే ఉండిపోవాలి. వివాహితులైతే తమ భర్తల నుండి వేరయిపోవాలి అనే భావన వారి మనస్సులలో నాటబడింది. సెయింట్ జీరూమ్ లాంటి అగ్రశ్రేణి క్రైస్తవ పండితుడు ఏమన్నాడంటే "ఏసు కోసం సన్యాసిని అయి జీవితాంతం కుమారిగానే ఉండిపోతే ఆమె క్రీస్తు యొక్క వధువు"; ఆమె తల్లికి దైవం లేక క్రీస్తు అత్తగారు (Mother-in-Law of God) అయ్యే గౌరవం లభిస్తుందని అన్నారు. మరొక చోట సెయింట్ జీరూమ్ అంటాడు; "సౌశీల్యపు గొడ్డలితో దాంపత్య సంబంధం అనే కఱ్ఱను నరకివేయడమే సాధకుని మొదటి కర్తవ్యం." ఇటువంటి బోధనల పర్యవసానంగా ధార్మిక ఉద్రేకం ఆవహించాక ఒక క్రైస్తవ పురుషునిపై గాని, క్రైస్తవ స్త్రీపైగాని మొట్టమొదట కనబడే ప్రభావం వారి దాంపత్య జీవితం శాశ్వతంగా ముగిసిపోవడమే. క్రైస్తవంలో విడాకులు, విభేదాలకు వీలు లేనందువల్ల వైవాహిక బంధంలో ఉంటూనే భార్యాభర్తలు ఒకరికొకరు విడిపోయే వారు. సెయింట్ నైలూస్ (St. Nilus) ఇద్దరు పిల్లల తండ్రి. అతడిపై సన్యాసత్వపు ప్రభావం పడగానే భార్య ఏడుస్తూ వున్నా పట్టించుకోక వదలి వచ్చేశాడు.

సెయింట్ అమ్మోన్ (St. Ammon) పెళ్ళయిన మొదటి రాత్రే భార్యకు దాంపత్య జీవిత పంకిలం గురించిన ఉపన్యాసం ఇచ్చి, బ్రతికున్నంత కాలం ఇద్దరూ ఒకరికొకరు వేరుగా ఉండేందుకు ఒప్పించాడు. సెయింట్ అబ్రహామ్ పెళ్లయిన రాత్రే భార్యను వదలి పరారయ్యాడు. సెయింట్ ఎలెక్సిస్ (St. Alexis) కూడా ఇలానే చేశాడు. క్రైస్తవ దైవజ్ఞుల గాధలు ఇటువంటి సంఘటనలతో నిండియున్నాయి.

చర్చి వ్యవస్థ 3 శతాబ్దాల వరకు తన పరిధిలో ఆ తీవ్రవాద ధోరణిగల భావాల్ని ఏదో ఒక విధంగా విమర్శించింది. ఆ రోజుల్లో ఒక ఫాదర్ (ఫాదరీ) బ్రహ్మచారి కావటం తప్పనిసరి మాత్రం కాదు. అతడు ఫాదర్‌గా నియుక్తుడవక పూర్వమే వివాహితుడు అయితే భార్యతో కలసి ఉండవచ్చు. కాని ఫాదర్‌గా నియుక్తుడయిన తర్వాత మాత్రం వివాహం చేసుకోవడం నిషేధం. విధవను కాని, విడాకులివ్వబడిన స్త్రీనిగాని పునర్వివాహం చేసుకునే వ్యక్తి ఫాదర్‌గా నియమింపబడటానికి అనర్హుడు. లేక ఇద్దరు భార్యలున్నా, ఇంట్లో ఆడ నౌకర్లున్నా సరే అతడు వివాహం చేసుకోరాదనే ఆంక్ష ఉండేది. క్రమంగా 4వ శతాబ్దిలో చర్చిలో మతపరమయిన సేవలు చేసే వ్యక్తి పెళ్ళి చేసుకోవడం తీవ్రంగా పరిగణింపబడేది. క్రీ.శ. 362లో గింగ్రా కౌన్సిల్ (Council of Gengra) ఆఖరు సమావేశంలో ఇటువంటి భావాల్ని మత వ్యతిరేకాలుగా తీర్మానించారు. కాని ఆ తర్వాత కొద్ది కాలానికే క్రీ. శ. 386లో రోమన్ సైనాడ్ (Synod) ఫాదర్‌లందర్నీ దాంపత్య సంబంధాలకు దూరంగా ఉండమని సలహా ఇచ్చింది. మరుసటి సంవత్సరం పోప్ సిరికీస్ (Siricius), "ఒక ఫాదర్ పెళ్లి చేసుకున్నా లేక పెళ్ళయినవాయితే భార్యతో సంబంధం పెట్టుకున్నా అతన్ని ఫాదరీ హోదా నుండి తొలగించడం జరుగుతుందని" ఆజ్ఞను జారీ చేశాడు. సెయింట్ జీరూర్, సెయింట్ అమ్‌బ్రోజ్, సెయింట్ ఆగస్టీన్ లాంటి ప్రఖ్యాత పండితులు ఈ తీర్మానాన్ని బలపర్చారు. కొద్దిపాటి అభిశంసనతో పాశ్చాత్య చర్చిలలో కఠినంగా ఈ ఆజ్ఞ విధించబడింది. అదే కాలంలో మొదటే పెళ్ళి అయి ఉండి మత సేవలకు నియోగించబడిన తరువాత కూడా తమ భార్యలతో "అక్రమ సంబంధం" కలిగి ఉన్నారన్న ఆరోపణల విచారణ నిమిత్తం ఎన్నో కౌన్సిళ్ళు ఏర్పడ్డాయి. ఆఖరుకు అటువంటి వారి సంస్కరణ కోసం చేసిన నిబంధనలు వినండి: అటువంటి భార్యాభర్తలు బహిరంగ ప్రదేశాలలో నిద్రించాలి. తమ భార్యలతో ఏకాంతంగా ఎప్పుడూ కలవకూడదు. వారు కలుసుకున్న సమయంలో కనీసం ఇద్దరు మనుష్యులు వారితో ఉండాలి. సెయింట్ గ్రిగరీ ఒక ఫాదర్ గురించి ఇలా తెలియజేశాడు. "40 ఏళ్ళ వరకు ఆ ఫాదర్ తన భార్యతో వేరుగా ఉన్నాడు.

ఆఖరికి చనిపోయే సమయంలో కూడా తన భార్య దగ్గరకు రాగా, ఓ స్త్రీ దూరంగా ఉండు" అన్నాడట.

4) అన్నిటికంటే సన్యాసత్వంలో బాధాకరమయిన విషయమేమిటంటే, అది తల్లీ, తండ్రీ, అన్న, చెల్లి, ఇంకా సంతానం వరకు మానవ బంధుత్వాన్ని త్రెంచివేసింది. క్రైస్తవ మహాపురుషులనబడేవారి దృష్టిలో కుమారుడి కోసం తల్లిదండ్రుల ప్రేమ, సోదరుడి కోసం అన్నాచెల్లెళ్ళ ప్రేమ, తండ్రికి సంతానంపై ప్రేమ కూడా పాపమే. ఆధ్యాత్మికోన్నతికి ఈ సంబంధాలన్నింటిని తెంచుకోవాలనేది వారి దృష్టిలో తప్పనిసరి. క్రైస్తవ మహాపురుషులనబడేవారి గాధలలో దీని హృదయవిదారకమైన సంఘటనలు చదువుతూ వుంటే వళ్ళు జలదరిస్తుంది. ఎవాగ్రిస్ (Eugrius) అనే ఒక సన్యాసి సంవత్సరాల తరబడి ఎడారిలో ఉంటూ ఆరాధనలో మునిగిపోయాడు. ఒకనాడు ఎంతో కాలంగా అతడి కోసం తపిస్తున్న అతని తల్లిదండ్రులు పంపిన ఉత్తరాలు అందాయి. ఆ ఉత్తరాలు చదివితే మానవ సహజమైన ప్రేమ జనిస్తుందని వాటిని కనీసం చదవకుండా మంటల్లో వేశాడు. సెయింట్ థియోడోరస్ తల్లి, సోదరి ఎందరో ఫాదర్‌ల సిఫారసు ఉత్తరాలు తీసుకొని అతడు ఉంటున్న ఆశ్రమంలోకి వెళ్ళి కనీసం కళ్ళారా చూసుకుందామని కోరారు. కాని అతడు వారి ముందుకు రావడాన్ని కూడా తిరస్కరించాడు. సెయింట్ మార్కస్ (St. Marcus) తల్లి, తన కుమారుడిని చూసేందుకు అతడున్న ఆశ్రమానికి వెళ్ళింది. ఆ ఆశ్రమ యజమాని (Abbot) ని సంతోషపరిస్తే ఆయన కుమారుడ్ని తల్లి ఎదుటకు రావడానికి అనుమతి ఇచ్చాడు. కాని కుమారుడు ఏ విధంగానైనా తల్లి ఎదుటకు రావడానికి సమ్మతించలేదు. ఆఖరికి అతను ఆశ్రమ యజమాని ఆజ్ఞను ఏ విధంగా పాటించాడంటే, వేషం మార్చి తల్లి ఎదుటకు వెళ్ళి కళ్ళు మూసుకున్నాడట. ఈ విధంగా తల్లి కొడుకుని గుర్తుపట్టకుండా, కొడుకు తల్లి ముఖము చూడకుండా ఉండడం జరిగింది. మరో మహాపురుషుడు సెయింట్ పోమన్ (St. Poemen) అతడి ఆరుగురు సోదరులు ఈజిప్ట్‌కు చెందిన ఎడారి ఆశ్రమంలో ఉండేవారు. కొన్ని సంవత్సరాల తర్వాత వారి వృద్ధమాతకు కుమారుల ఆచూకి తెలిసి అక్కడికి వెళ్ళింది. కొడుకులు తల్లిరావడం దూరం

నుంచే చూసి తమ గదుల్లోకి పారిపోయి తలుపు బిడాయించుకున్నారు. తల్లి బయట నుంచి గోడుగోడున విలపించసాగింది. "ఈ వయసులో మిమ్మల్ని చూద్దామని ఇంత దూరం వచ్చాను. మీ ముఖాలు ఒక్కసారి చూస్తే మీకు కలిగే నష్టమేమిటి? నేను మీ తల్లిని కానా?" అంది. అందుకు ఆ కొడుకులు తలుపులు తీయకుండానే, "మేం నిన్ను దేవుడి దగ్గర కలుసుకుంటాం" అని చెప్పారు. అంతకంటే హృదయ విదారకమయిన సంఘటన సెయింట్ సైమన్ స్టైయిలైట్ (St. Simon Stylite)ది. ఇతడు తల్లిదండ్రుల్ని వదలి 27 ఏండ్లు మాయమయ్యాడు. తండ్రి అతని బెంగలో ప్రాణాలు విడిచాడు. తల్లి బ్రతికే వుంది. కుమారుడి గురించి దరిదాపుల్లో బాగా ప్రచారం జరిగి కుమారుడు ఎక్కడున్నాడో తెలిసింది. పాపం ఆ తల్లి అతడున్న ఆశ్రమం చేరింది. కాని ఆశ్రమం లోపలికి రావడానికి స్త్రీలకు అనుమతి దొరకదు. తనను లోపలికయినా రానిమ్మని లేదా కొడుకుని బయటకయినా రమ్మని శతవిధాలా బ్రతిమాలింది. కాని ఆ "మహాపురుషుడు" తిరస్కరించాడు. మూడు రాత్రులు మూడు పగళ్ళు ఆ ఆశ్రమం గుమ్మంలోనే పడివుండి చివరికి అక్కడే ప్రాణాలు విడిచింది ఆ మాతృమూర్తి. అప్పుడు అతడు బయటికి వచ్చి తల్లి శవంపై అశ్రువు రాల్చి ఆమె ఆత్మశాంతికి ప్రార్థనలు చేశాడు.

ఇలాంటి నిర్దయ ఆ మహాపురుషులు అక్కాచెల్లెళ్ళ పట్ల, తమ పిల్లల పట్ల కూడా చూపారు. ఒకాయన మ్యూటియస్ (Mutius) గురించి వ్రాశాడు. మ్యూటియస్ కాస్తో కూస్తో ఉన్నవాడే. కాని అతనిపై మతోన్మాదం ఎకాయెకిన ఆవహించినప్పుడు తన 8 ఏండ్ల ఏకైక కుమారుడిని వెంటబెట్టుకుని సన్యాసాశ్రమంలో ప్రవేశించాడు. అక్కడకు వెళ్ళాక పుత్ర ప్రేమను ఆధ్యాత్మికోన్నతి కోసం త్యాగం చేయాల్సి వచ్చింది. ఇందుకోసం మొదట తండ్రీ కొడుకుల్ని వేరుచేశారు. ఆ తర్వాత అతని కళ్ళ ఎదుట ఆ చిన్నారి బాలుని అనేక రకాలుగా హింసించారు. అవన్నీ చూస్తూవున్నాడా తండ్రి. ఆ ఆశ్రమాధిపతి మ్యూటియస్‌ని, కుమారుణ్ణి తీసుకెళ్ళి తన చేతులతో సముద్రంలో పారవేయమన్నాడు. మ్యూటియస్ అందుకూ సిద్ధపడ్డాడు. అయితే అతను సరిగ్గా సముద్రంలో పారవేస్తున్న

సమయంలో ఆ సన్యాసులు పిల్లవాడి ప్రాణాలు కాపాడారు. తర్వాత అతను నిజంగానే "మహా పురుషుడు" (వలి) స్థాయికి చేరుకున్నాడని ఒప్పుకోవడం జరిగింది.

సన్యాసత్వం విషయంలో క్రైస్తవ భావన ఏమంటే, దైవ ప్రేమను పొందాలనుకునేవాడు, ప్రపంచంలో తల్లిదండ్రులతో, అన్నాచెల్లెళ్ళతో, పిల్లా జెల్లలతో బంధించివేసే మానవ సహజ ప్రేమానుబంధాల సంకెళ్ళనన్నింటినీ త్రెంచివేయాలి. సెయింట్ జిరూమ్ బోధన ఏమంటే; "నీ అన్న కొడుకు నీ మెళ్ళో చేతులువేసి కౌగిలించుకుంటాడేమో – నీ తల్లి తను పాలుపట్టి సాకిన విషయం గుర్తుచేసి ఆపుతుందేమో! నీ తండ్రి నిన్ను ఆపడానికి నీ దారిలో అడ్డంగా పడుకోవచ్చు. అయినా నువ్వు అందర్నీ విడిచిపెట్టి నీ తండ్రి శరీరంపై నుండి నడిచి దాటిరా; శిలువ పతాకం నీడన చేరుకో. ఒక్క చుక్క నీరు కూడా నీ కంటి కొనుకులు దాటకూడదు. జాగ్రత్త! ఈ విషయంలో నిర్దయే దైవ భయభక్తులకు నిదర్శనం." సెయింట్ ప్రేషూరీ ఇలా వ్రాస్తాడు: "ఒక యువ సన్యాసి తన తల్లిదండ్రుల పట్ల ప్రేమను హృదయం నుండి తీసివేయలేకపోయాడు. ఒకరోజు రాత్రి చెప్పాపెట్టకుండా పారిపోయి, తన తల్లిదండ్రులను కలసివచ్చాడు. దీనిపై దైవం ఇచ్చిన శిక్ష ఏమంటే అతడు ఆశ్రమానికి చేరుకోగానే ప్రాణాలు వదిలాడు. అతని కళేబరాన్ని భూమిలో పాతిపూడ్చారు. అయితే భూమి అతని శరీరాన్ని స్వీకరించలేదు. ఎన్నిసార్లు అతని శరీరాన్ని సమాధిలో వేసి పూడ్చినప్పటికీ, ప్రతిసారి భూమి ఆ కళేబరాన్ని బయటికి విసిరివేసేది. చివరికి సెయింట్ బెనడిక్ట్ ఆ కళేబరం ఛాతిపై పవిత్ర ప్రసాదం ఉంచి పాతిపెట్టగా అప్పుడు అతని సమాధి అతడ్ని అంగీకరిం చింది." గ్రిగరీ ఒక సన్యాసిని గురించి ఇలా వ్రాశాడు: "ఆమె చనిపోయాక మూడు రోజులు పీడించబడింది. కారణం యేమంటే ఆమె తన హృదయంలో నుండి తల్లి ప్రేమను తొలగించలేకపోయినది" ఒక మహాపురుషుని గురించి ప్రశంసిస్తూ ఇలా వ్రాశాడు, "అతడు తన బంధువుల పట్ల తప్ప ఎవ్వరితోనూ కఠినంగా వ్యవహరించలేదు."

5) తన సమీప బంధువులతో నిర్దాక్షిణ్యం, కఠినత్వం అవలంబించే

అభ్యాసం చేయడం వల్ల వారిలో మానవత్వమే నశించింది. పర్యవసానంగా మతపరయిన విభేదాలున్న వారి పట్ల వీరు చేసే మతిలేని హింసా దౌర్జన్యాల్లో మితిమీరిపోయే వారు. 4వ శతాబ్దికి చేరుకునే సరికి క్రైస్తవం 80, 90 తెగలుగా విడిపోయింది. సెయింట్ ఆగస్టీన్ తన కాలంలో 88 తెగల్ని లెక్కించాడు. ఈ తెగలు పరస్పరం ద్వేషించుకునేవి. ఈ విద్వేషాన్ని రగిల్చే వారూ క్రైస్తవ సన్యాసులే. ఈ విద్వేషాగ్నిలో వివిధ వర్గాల్ని మాడ్చి మసిచేసే ప్రయత్నంలో ముమ్ముందు ఉన్నవారు కూడా సన్యాసులే. ఇస్కంద్రియా (అలెగ్జాండ్రియా) ఇటువంటి వర్గ సంఘర్షణలకు ఆయువుపట్టుగా ఉండేది. అక్కడ మొదట ఆరియన్ (Arian) వర్గానికి చెందిన బిషప్, అధినాస్యూస్ సంఘానికి చెందినవారిపై దాడిచేశాడు. వారి ఆశ్రమాల్లో ఉండిన అవివాహిత సన్యాసినులను వెంటాడి బయటకి ఈడ్పించాడు. వాళ్ళను వివస్త్రల్ని చేసి, ముళ్ళ కొమ్మలతో వాళ్ళ నగ్న శరీరాలపై కొట్టించడం జరిగింది. వారి దేహంపై వాతలు పెట్టారు – వారు తమ విశ్వాసం నుండి తప్పుకోవాలని. తర్వాత ఈజిప్ట్‌లో కాథలిక్కులకు ఆధిపత్యం లభించినప్పుడు, వీరు కూడా ఆర్యన్ వర్గంపై ఇలాగే అత్యాచారం జరిపారు. చివరికి స్వయంగా ఆర్యన్‌ని కూడా విషప్రయోగం ద్వారా చంపారనేది చాలా మంది అభిప్రాయం. ఇస్కంద్రియాలోనే ఒకసారి సెయింట్ సయిరిల్ అనుయాయి సన్యాసులు మహా కల్లోలాన్నే సృష్టించారు. విరోధి వర్గం నుండి ఓ మహిళా సన్యాసినిని పట్టి తమ స్థావరానికి తీసుకెళ్ళి వధించారు. ఆవిడ శవాన్ని ముక్కలు ముక్కలుగా చీల్చేశారు. తర్వాత దాన్ని మంటల్లోకి విసిరేశారు. రోమ్ పరిస్థితి కూడా దీనికి భిన్నంగాలేదు. క్రీ.శ. 366లో పోప్ లిబేరియస్ మరణం తర్వాత రెండు ముఠాలు పాపాల్ అధికారం కోసం తమ తమ అభ్యర్థుల్ని నిలబెట్టాయి. రెండు వర్గాల మధ్య కొట్లాటల్లో తీవ్ర రక్తపాతం జరిగింది. ఒక్క రోజులో ఓ చర్చి నుండే 137 శవాలు బయట పడ్డాయి.

6) ఈ సన్యాసం మరియు వైరాగ్యాలతోపాటు ప్రాపంచిక ధనాన్ని సమీకరించుకోవడంలో కూడా లోటు రానీయలేదు. 5వ శతాబ్ది ఆరంభంలోనే పరిస్థితి

ఎలా ఉందంటే రోమ్‌కు చెందిన బిషప్ బాదుషాల వలె తన మహలులో జీవితం గడపసాగాడు. అతడి సవారీ నగరంలోకి బయలుదేరినపుడల్లా సీజర్ (క్రైసర్), సవారీ మందీ మార్బలానికి తీసిపోనట్లుగా ఉండేది. సెయింట్ జీరూమ్ తన కాలంలో (4వ శతాబ్ది ఆఖరి భాగంలో) చాలా మంది బిషప్‌లు చేసిన విందులు గవర్నర్ల విందుల్ని తలదన్నేటట్లు ఉండేవని ఆరోపించాడు. సన్యాసాశ్రమాల్లో, మఠాల్లో ధనప్రవాహం 7వ శతాబ్ది (ఖుర్ఆన్ అవతరించిన కాలం) వరకు తారాస్థాయికి చేరుకుంది. ఎవరివల్లనైనా మహాపాపం జరిగిపోతే పరిహారంగా ఎవరో ఒక మహాపురుషుని (Saint) సమాధిపైన నజరానాలు, ముడుపులు చెల్లిస్తేనే లేదా ఆశ్రమానికీ, చర్చికి ఫండ్ చెల్లిస్తేనే పాపం హరిస్తుందని ప్రజల్ని బాగా నమ్మించారు. ఆ తర్వాత ఏ ప్రపంచాన్నయితే ఈ సన్యాసులు త్యజించడం పరమ ధ్యేయంగా భావించారో ఆ ప్రపంచమే వీరి పాదాల వద్దకు రాసాగింది. ఈ పతనావస్థకు చేరుకోవడానికి ప్రత్యేక కారణమేమంటే సన్యాసుల అసాధారణ తపస్సులు, కోరికల్ని అణగద్రొక్కే అద్భుతాలు చూసి ప్రజల్లో వారి పట్ల ఎనలేని భక్తివిశ్వాసాలు పుట్టుకురావడంతో ప్రాపంచిక సుఖలాలసులు సన్యాసుల వేషాలు ధరించి ఈ సన్యాసుల గుంపులో కలిసిపొయ్యారు. వైరాగ్యమనే ముసుగులో వీరి భోగలాలసత్వం ఎంతగా విజృంభించిందంటే పెద్ద పెద్ద సుఖభోగులయినవారు కూడా వీరిని చూచి తలవంచుకోవాల్సిందే.

7) శారీరక వాంఛల విషయంలో కూడా సన్యాసత్వం సహజత్వానికే ఎదురుతిరిగి అనేకసార్లు ఓడిపోయింది. ఆశ్రమాలలో కోరికల్ని అణగద్రొక్కే అభ్యాసంగా సన్యాసులు, సన్యాసినులు ఒకేచోట ఉండేవారు. ఒక్కోసారి అభ్యాసాన్ని తీవ్రతరం చేయడానికై ఒకే ప్రక్కపై శయనించేవారు. ప్రసిద్ధ సన్యాసి సెయింట్ ఎవాగ్రియస్ (St. Evagrius) పాలస్తీనాకు చెందిన సన్యాసుల గురించి ప్రస్తావిస్తూ ఇలా రాశాడు, "వారు తమ కోరికల్ని ఎంత గొప్పగా జయించారంటే, సన్యాసినులైన స్త్రీలు, సన్యాసులయిన పురుషులు కలసి ఒకేచోట స్నానం చేసేవారు. నగ్న దృశ్యాలుగాని, పరస్పర స్పర్శగాని, చివరికి ఒకరి కౌగిలిలో మరొకరున్నా వారి

ఇంద్రియాలు ఏ విధంగాను చలించలేదు." స్నానం చేయడమనేది సన్యాసత్వంలో అయిష్టకరమయినదయినా ఇంద్రియ నిగ్రహ శిక్షణలో భాగంగా ఇలా కలసి స్నానాలు ఆచరించేవారు. ఈ పాలస్తీనా గురించే నైసా (Nyssa)కు చెందిన సెయింట్ గ్రిగరీ మెతీఫి (క్రీ.శ.396) వ్రాస్తాడు. "అది వ్యభిచార నిలయంగా మారిపోయింది." మానవ స్వభావం దానితో వైరం వహించిన వారితో బదులు తీర్చుకోకుండా ఉండలేదు. సహజత్వం, సన్యాసత్వంతో పోరాడి ఎటువంటి నైతిక పతనపు అగాధంలో పడిపోయిందంటే దాని గాధ క్రీ.శ. 8వ శతాబ్ది నుండి 11వ శతాబ్ది వరకు మత చరిత్రలో మాయని మచ్చగా మిగిలిపోయింది. 10వ శతాబ్దికి చెందిన ఇటలీ బిషప్ వ్రాసాడు. "చర్చిలో మత సేవలు చేసేవారికి అసభ్య ప్రవర్తనకు శిక్ష విధించడానికి ఆచరణాత్మకంగా చట్టం చేయడం జరిగితే బాలురు తప్ప ఎవరూ శిక్ష నుండి తప్పించుకోలేరు. అక్రమ సంతానాన్ని ధార్మిక సేవలు చేయడం పట్ల ఆంక్షలు విధిస్తే చర్చి సేవకు ఏ బాలుడూ మిగలడు." మధ్యయుగాల రచయితల ఎన్నో గ్రంథాలు, సన్యాసినుల మఠాలు అశ్లీల కేంద్రాలుగా మారిన ఉదంతాలతో నిండి ఉన్నాయి. వారి ఆశ్రమాల నాలుగ్గోడల మధ్య కొత్తగా పుట్టిన పిల్లలు సామూహికంగా చంపబడుతున్నారు. ఫాదర్‌లు ఇంకా చర్చిలోని ధార్మిక కార్యకర్తలకు స్త్రీ సన్యాసులతోనే కాక, సాధారణ గృహిణుల మధ్య విచ్చలవిడిగా అక్రమ సంబంధాలు, ఆశ్రమాల్లో అసహజ కామక్రీడల్లాంటి నేరాలు వ్యాపించాయి. చర్చిలలో పాపం చేసినట్లు ఒప్పుకోవడం (Confession) ద్వారా పరిశుద్ధులయ్యే ఆచారం, అశ్లీలతకు కారణభూతమయ్యింది.

సన్యాసత్వం అనే బిద్అత్‌ని ప్రారంభించి, ఆ తర్వాత, దాని విధులను పూర్తిచేయలేదనే ఖుర్ఆన్ ప్రస్తావన, క్రైస్తవంలోని ఎటువంటి చెడును ఎత్తి చూపుతుందో ఈ వివరాల ద్వారా వాస్తవముగా అంచనా వేయవచ్చు.

– : సమాప్తం : –